# స్వవిషయము

ఆంధ్రసర్వస్వముయొక్క మొదటి సంపుటము ముగించి చాలకాలమైనను రెండవ సంపుటము ప్రారంభించుట కింత వఱకును దీరినది కాదు. దీనికి కారణము లేక పోలేదు.

మిన్ను విరిగి మీఁద పడునటుల మా కార్య సంబంధములైన యిక్కట్టు లెన్ని వచ్చినను వెనుకంజ వేయని ధీరమయ్యు గర్భశోకమునకు మాత్రము తలవంపక తప్పినది కాదు. చిత యొక్క నిమిషములో దహించు మానవ శరీరమును చింత బ్రతికి యున్నంత కాలము దహించును గదా? అల్లారుముద్దుగ పుట్టి పెరిగిన పదునొకండుమాసముల ఏకపుత్రిక సూర్యప్రకాశి యొక్క అకస్మికమరణమే ఈ ఆలస్యమునకు కారణము.

పత్రికలోని అంశములు మా పాఠకులకు విదితమే. ప్రకటనోద్దేశ్యము లెన్నియో యుండవచ్చును. చేయుట చెప్పునంత సులభము కాదు. చింతలకాక్ష కాని సుటికిల కాక్ష రా! ఆ యుద్దేశ్యము లన్నియు నొక మహాపురుషునిచేఁ గాని, ఒక పత్రికచేఁ గాని, యింత కాలములో పూర్తియగు నటులకుఁ గాని వలనుపడదు. సంఘము సహస్ర ముఖమైనట్టిది. అందఱిని మెప్పింప నా బ్రహ్మకైన అరిది. కాల మనంతము. అందు మనము అల్పులమును గాము. కావున యథాశక్తి కొలది వారు చేయుటయు ను రాఁబోవువారలకుఁ సోపానమగుటయు ను అయి యున్నది మన పని. అట్టిశక్తి మేము మా ప్రకటనోద్దేశ్యమును కొంత వఱకైన నెఱవేర్చితి మనుసను నెమ్మదియే యగును.

మా పత్రికకు పెద్దవ్యాసముల నొసంగిన బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి మహాభాష్యం సుబ్రహ్మణ్యం కట్టా వేంకటరావు చిలుకూరి నారాయణరావుగార్లకును యితరవ్యాస లేఖకులకును మే మెంతెయుఁ గృతజ్ఞులము. ఇక సారస్వతసమాజ సభ్యులకును మాకును అభేదము. తుద నొకటి మనవి చేయ వలసి యున్నది. "మనదేశభాషలు" అను వ్యాసమును వ్రాసిన మహాభాష్యం సుబ్రహ్మణ్యం గారికి సూపకసర్వస్వమును వ్రాసిన మహాభాష్యం సుబ్రహ్మణ్యశాస్త్రిగారని మా చదువరు తెలియఁదగినది.

వ్యాసలేఖకులును చందాదారులును ఎప్పటియట్ల పత్రికను పోషింపఁగోరెదము. బకాయిందారులును యింతవఱకు చందాల నొసఁగనివారును తాము చేయఁగోరెడి సాహాయ్యమును వెంటనే దయచేయఁగోరెదము.

# కంటి వెన్నంటి చని మేలు కంటి సకియ?

[1 ఓలేటి సత్యనారాయణశాస్త్రిగారు]

[2 పండిత పెనుమెత్స సత్యనారాయణరాజుగారు]

ఒడ లెఱుంగని నిద్దుర బడసినపుడు
అంత బ్రహ్మస్వరూపమె యుడరునపుడు
ముద్దులొల్కెడు సొగసైన మోమువాని
ముసి ముసి నగవున వెలుగు మొగమువాని
క్రాపుగలవాని చక్కని కనులవాని
కోరమీసాలు గలవాని గొండె కాని
కంటి వెన్నంటి చనిమేలు కంటిసకియ?

చికి చికి కురులు నొసటను చిందులాడ
దంత కాంతులు వింతయౌ తళుకుజూప
అమృతమును జిల్కు ముద్దుం నాఁడువాని
కంటి వెన్నంటి చనిమేలు కంటిసకియ?

ఎన్నియో పల్కె యాన లూరించె కాని
తేనియలనొల్కు నధరోష్ఠ మానవీక
దూర దూరము నందున దాఁగువాని
కంటి వెన్నంటి చనిమేలు కంటిసకియ?

కాలి గజ్జెలు ఘలుఘల్లు ఘల్లురనఁగ
తటుకునన్ వాని జేఁబట్ట దలఁచునంత
లలిత పల్లవములనొప్పి కేలను సన్న
వనములో దూరి వడివడి చనెనువాని
కంటి వెన్నంటి చనిమేలు కంటిసకియ?

అంత నెలుఁగెత్తి గట్టిగా పతని బిలచి
కంఠ హారమ్ము కానుకగాఁగ నిత్తు

చేతిగడియారమును నీకు చేతికిడుదు
ఉంగరమ్ముల నీ వ్రేళ్ల నుంచుదాన
అవ్వి యివి యని వేఱుగా ననగనేల?
వెతలు గుసగుసల తెమిమీర వేగిరంబు
తిరిగి చనుదెంచి నాకోర్కె దీర్చువేని
ప్రాణములనైన నిత్తు నీయానసుమ్మ
అనుచు బ్రతిమాలినన్ రాక చనెడువాని
కంటి వెన్నంటి చనిమేలు కంటినకీయ?

అతని యూరైన పేరైన నడుగనైతి
అయ్యయో జీవనంబెల్ల వ్యర్థమనుచు
అర్థప్రాణంబు పోయిన దనుచు వగచి
కన్ను తెలుపిట్టె నెలమావిగున్నలెక్కె
గుండెలవియంగ కోయిలల్ గూయుచుండ
భృంగములు పద్మములు ప్రలాపించుచుండ
తెమ్మ తెమ్మెరల్ బారులు దీర్చివీవ
నాదు నోములు ఫలియించి నటులవాని
తగటుసేలువకంచెకుం దగులువడియె
దాని నాటెడు విడదీయు తరుణమందు
కాలియందెలు చప్పుడు కాకయుండ
చెట్లసందునబడి వాని జేరువేళ
దుష్ట సర్పంబుచే గాలు దష్టమయ్యె
అంత గుండెలు బరువయ్యె నడుగు బడదు
కనులు మూతలు పడుచుండె గానివాని
కంటి వెన్నంటి చనిమేలు కంటినకీయ?

# దివానుపూర్ణయ్య

[భావరాజు వేంకటకృష్ణారావుపంతులుగారు బి. ఎ. బి. యల్]

దివానుపూర్ణయ్య మహామంత్రిశేఖరుఁడు. ఆయనపేరు విననివారాంధ్రులలో నరిదిగా నుందురు. పూర్ణయ్యగారాంధ్రబ్రాహ్మణులని ఆంధ్రులయభిప్రాయము. కర్ణాటబ్రాహ్మణుడని కన్నడదేశీయులవాదము. ఉభయవాదములకు దగిన ప్రమాణాధారములేవియు గానరావు. గొప్పవాఁడొకఁడు మావాఁడని చెప్పుకొనదలచు దేశాభిమానులకు దివానుపూర్ణయ్య యొక మహాపురుషుఁడు. పూర్ణయ్యగారిపుట్టుపూర్వోత్తరములు నవిస్తరముగా దెలుపు చరిత్రములు లేవు. మొదలెచ్చటవాఁడో, యెచ్చట జనన మొందెనో, జననీజనకు లెవ్వరో, యింటిపేరెయ్యదియో తెలిసికొనుటకెట్టి యవకాశములును లేవు. మొట్టమొదట కడు నీచదశయందు జీవిత మారంభించి క్రమక్రమముగా తన యసమాన ప్రతిభా విశేషముచేత నేమి యదృష్టముచేతనేమి మైసూరు రాజ్యమునందు మహోన్నతపదవికి వచ్చి, అమాత్య సేనాపతి భాండాగారధ్యక్ష పదవుల నలంకరించి, దేశీయులమాత్రమెగాక, విదేశీయులయొక్కయు కూడ కృతజ్ఞతకును, విశ్వాస గౌరవములకును బాత్రుడై కీర్తికెక్కిన మహనీయుడని, యాయన నెఱిఁగినవారెల్లను నైకకంఠముతో బల్కుచున్నారు. ఆంధ్రమహామంత్రి శేఖరుఁడగు సాళువ తిమ్మరసునకుఁ బిమ్మట నంతటి మంత్రివర్యుఁడు పూర్ణయ్య నధివ్యాగ్రశేయని వాక్రుచ్చిన యతిశయోక్తి కాజాలదు. ఆమహనీయుని జీవితచారిత్రము వలెనే మన కథానాయకుని జీవితము కూడ చరిత్రయందు వ్యగ్రమయినది. ఆయనవంటి ప్రధాని, ఈకాలమున మఱియొకఁడు గానరాడు.

దివానుపూర్ణయ్య, కోయముత్తూరు జిల్లాలో, నొకగ్రామమున, నొకబీదబ్రాహ్మణకుటుంబమున జన్మించెనట. ఆతని పుట్టిన సంవత్సరముగాని గ్రామము పేరుగాని యేమియు తెలియరావు. మైసూరు హిందూరాజ్యము నాక్రమించుకొని, రాజునుజంపి, సింహాసనమెక్కి మహమ్మదీయ వంశమును నిల్పిన, సుల్తాను హైదరాలీఖాను ప్రభుత్వమున దివానుపూర్ణయ్య భాండాగారధ్యక్షుడై ప్రసిద్ధుడై రాజ్యాదాయమును సర్వవిధముల వృద్ధిజేయుచు, సుల్తాను ప్రేమపాత్రుడై మనకు తొలుత కానవచ్చుచున్నాడు. సామాన్య సర్దారుగ జీవితమారంభించి రాజ్యపదవిని తన స్వశక్తిచే సాధించిన హైదరాలీకి అసమాన ప్రతిభాశాలియు, విశేషించి, నీతిజ్ఞుడును, అన్ని విధముల దక్షుడు నగు పూర్ణయ్య అత్యంత విశ్వాసపాత్రుడుగా గన్పట్టెను. హైదరుంచిన విశ్వాస భక్తి గౌరవములకు పూర్ణయ్య సర్వవిధముల పాత్రుఁడయ్యు,యా

తనివలన మారువల్లి తాలూకాను జాఘీరుగా బడయగలిగెను.

తానెవరి, ప్రాభవ, ప్రాపకముల క్రింద, తొలుత జీవితమారంభించి, మహోచ్ఛదశకు వచ్చెనో, యాతురుష్కరాజవంశమున కత్యంత విశ్వాసపాత్రుడైన భృత్యుడై రాజ్యపరిపాలనము చేసి కీర్తిగాంచెను. ఆమహమ్మదీయ రాజవంశము, రాజ్యభ్రష్టత్వము నొందినపిదప, పూర్ణయ్య, యించుకయు జలింపక పూర్వపు హిందూ రాజవంశమును మైసూరు సింహాసనమున బ్రతిష్ఠించి, తానే ప్రాపును, అండయునై, తొలుత తానెవరిని గొలిచి యభ్యుదయమునకు వచ్చెనో, వారలకు ప్రబలశత్రువులయిన ఆంగ్లేయులకు, స్నేహితుడై మెలగి, రాజ్యమును పరిపాలించిన పూర్ణయ్యగారి శీలము, అనేక సందియములకు తావిచ్చియున్నది. ఆతడు నిజముగా రాజద్రోహియనియు, టిప్పూసుల్తాను పదభ్రష్టత్వము నొందుట కతడే కారణమనియు సమకాలీనులలో కొందరును, దరువాతివారిలో కొందరును యభిప్రాయపడుచున్నారు. యదార్థమును దెలుపు చరిత్రాధారములు లేని సమయమున పుక్కిటిపురాణములను విశ్వసించి పూర్ణయ్యగారి శీలమును విమర్శింపబూనుట పాడిగాదు. అయినను, ప్రజాసంఘమున వ్యాప్తమైయున్న విషయములు పూర్ణయ్యను దోషియని నిందించుచున్నవి. బ్రిటిషుసైన్యములు శ్రీరంగపట్టణమును ముట్టడించి శతఘ్నులు ప్రేల్చునపుడు సుల్తానునకు వార్తయైనను పూర్ణయ్య తెలుపడయ్యెనట. మధ్యాహ్న సమయమున సకుటుంబముగా, సరససల్లాపములతో ముచ్చటలాడుకొనుచు భోజనమారగించు సుల్తానునకు బ్రిటీషుసైన్యముల దాడి యత్యంతాశ్చర్యకరమయి నిశ్చేష్టితుని జేసెనట. బ్రిటిషువారియు నాసపెట్టిన ధనకనకవస్తువాహనములకు జాఘీరులకును ఆసపడియో, సుల్తాను తనయెడ గావించిన మహోపకారములను సైపజాలకయో పూర్ణయ్య యట్టి ద్రోహకార్యమున కొడిగట్టియుండునని కొందరి యభిప్రాయము. ద్రోహము నెఱింగినతరువాత టిప్పూ ఆయుధహస్తుడై దుర్గద్వారముచెంతకు బోయి కంఠమున ప్రాణములున్నంతకాలము సైనికుల పురికొల్పుచు యుద్ధముచేసి గాయములవలన మృతినొందెనట. బ్రిటిషుదళములు శ్రీరంగపట్టణమును బ్రవేశించి కోటద్వారమును భేదించి తెఱచునప్పటికి టిప్పూ కళేబరము మొదట గాన్పించినటుల చరిత్రలు దెలుపుచున్నవి. పూర్ణయ్య టిప్పూయెడల ద్రోహ మాచరించుటకు దగిన కారణము లేవియును ఆంగ్లేయచరిత్రలయందు గానరావు. సర్వవిధముల తన్నాదరించి గౌరవించిన సుల్తానునకు అపకారమాచరించుటకు బ్రిటిషుప్రభువు లాసపెట్టిన ధనము కారణమని నమ్మి, యాతని నిందించుట పుక్కిటిపురాణముల

నమ్ముట యగును—ఏదియెట్లున్నను అతడొకచోట తన యాదర్శములను గూర్చి వ్రాసిన సందర్భమును దెలిసికొనిన యాతని సౌశీల్యము మనకు విశదముగాగలదు. "భగవంతు డెవ్వనికి అధికారపదవినిచ్చి ప్రజాపాలనము సేయ నియమించెనో, యాతడు ప్రజాహితమే, ధర్మమునకును శాంతికిని సుఖమునకు మార్గదర్శక మని నమ్మి నడచుకొనుచో నాతడు స్వధర్మమును చక్కగా నిర్వర్తించి దైవము నిర్ణయించిన దానిని జరిపినవాడగును. అతనిచే పాలింపబడిన ప్రజలు సుఖింతురు. అతని రాజ్యములో దుష్టులు బలవంతులు కాజాలరు"

మొదటినుండియు తన కత్యంత ప్రాపయి యుండిన సుల్తాను హైదరల్లీ యెడలను అతని తనయుడగు సుల్తాను టిప్పూ యెడలను మంత్రి పూర్ణయ్యకత్యంతమయిన గౌరవభక్తి విశ్వాసము లుండె ననుట నిర్వివాదాంశము. సమరరంగమున శత్రుజనమధ్యమున హైదరు తన సర్వస్వమును పూర్ణయ్యకు నప్పగించి నిర్విచారముగ ప్రాణములను విడిచెను. ప్రాణావసానసమయమున యువరాజగు టిప్పుసుల్తానునకు హైదరు కడపటిసందేశపు టుత్తరము వ్రాయుచు పూర్ణయ్యప్రధానివంటి విశ్వాసార్హుడును స్వామిభక్తిగల ప్రతిభాశాలియు రాజనీతిజ్ఞుడును మరియొకడు తనకు లభింపజాలడనియు నెట్టివేళ నాతని పరిత్యజింపవలదనియు దెలిపియుండెనట. హైదరుంచిన నంపూర్ణవిశ్వాసమును పూర్ణయ్య తన బుజువర్తనముచే గౌరవించి కీర్తినియుడై వెలసెను. హైదరు ప్రాణములు పోవునప్పటికి రాజ్యమంతయు నల్లకల్లోలమై యుండెను. చుట్టుప్రక్కల ప్రదేశమంతయు శత్రువులచే నిండియుండెను. రాజధానియు కడు దూరముగ నుండెను. యువరాజును సుల్తానుకొఱకై యుద్ధములుచేయుచు కొన్ని వందల మైళ్ళదూరమున మంగుళూరునకు సమీపమున నుండెను. తండ్రి వ్యాధిగ్రస్తుడై యుండిన వార్తయు టిప్పూఖానునకు తెలియరాకుండెను. పూర్ణయ్య తప్ప నాప్తులెవ్వరును మరణాసన్నుడైన సుల్తాను వద్ద లేకుండిరి. అప్పుడాతడు భాండాగారాధ్యక్షుడై సమరమునకు సైన్యములనాయత్తపఱచుచుండెను. సుల్తాను వ్యాధివార్తలు రాజధానికి ప్రాకినతోడనే రాజద్రోహము మొలకలెత్తెను. ఒకప్రక్క హిందూరాజవంశమును మరల సింహాసనముపై ప్రతిష్ఠించుటకు ప్రయత్నములు సాగుచుండెను. మహమ్మదీయ ప్రభుత్వమును మహమ్మదీయ రాజవంశమును కూడ నంతమొందునేమో యని భయమెల్లడలను దోచెను. ఎంత చేసినను హైదరుఖాను హిందూ రాజుపట్ల ద్రోహియై వర్తించి రాజ్యాపహారణము జేసినవాడేకదా యని యెల్లరకును దోచెను. మహమ్మదీయ సామంతకోటికి హైదరు వ్యాధిగ్రస్తుడగుట కొంత దురాశలను కల్గించెను. సుల్తానునకు విశ్వాసపాత్రుడైన మంత్రిశిఖామణి విమతస్థుడగుటవలన వారలకు సంశయము లనేక

నుండి మఱియొకచోటికి తిరుగుచు నిలువ నీడయు, మనసునకు కుదురుపాటును లేని సమయమున, సుల్తానున కుత్సాహము చేయుచు, ఎప్పటికప్పుడు సైన్య సమూహములను సన్నాహము చేయుచు, బొక్కసమునందు ధనము కొరంత రానియక సైన్యములకు జీతభత్యముల సరిగా నిచ్చుచు విజయములు గూర్చిన పూర్ణయ్య రాజకార్యనిర్వాహణపటుత, స్వామిభక్తి, సుల్తానున కత్యాశ్చర్యకరములయ్యెను. సుల్తానునకేగాదు, విజాతీయులగు నాంగ్లేయులకుగూడ నాశ్చర్యకరమయ్యెను. ఎన్ని యుద్ధములోడినను, ఎంతనష్టము సంభవించుచున్నను చలింపక ధైర్యసాహసములతో నాంగ్లేయులకు యిడుములు కల్పించుచు మరలమరల నెదుర్కొని యుద్ధరంగమున జయములు గొన్న టిప్పూసుల్తానునకు పూర్ణయ్య పట్టుగొమ్మయైయులరారెను. వేయేల టిప్పూయంతటి ప్రచండపరాక్రమశాలియు, శూరుడును కూడ పూర్ణయ్య మంత్రి యండలేకుండ మనజాలి యుండడు. అట్టి సుల్తానునకట్టి ప్రధానియుండుట బట్టియే, యామైసూరు మహమ్మదీయ రాజ్యము దుర్నిరీక్ష్యమయ్యెను. దుర్జేయమయ్యెను.

సర్వదా యుద్ధాగ్నులందు మునిగి తేలుచుండిన మైసూరు రాజ్యమును పరిపాలించుట యందును, రాజ్యాదాయము వృద్ధిచేయుట యందును, ప్రజాహిత పరిపాలన మొనర్చుటకు పూర్ణయ్యగావించిన ప్రయత్నములు అపారములు. అద్భుతములు. కాలవశమున నేమి, మన దురదృష్టవశమున నేమి, టిప్పూ పరిపాలనమున మైసూరుస్థితి యెట్టిదో నిర్ణయించుటకు తగిన యాధారములు దొరకకుండుటయు, తెలిసినవృత్తాంతములును నాంగ్ల చరిత్రకారుల వ్రాతలనుండి వెలువడుటయు, నగుటకతన పూర్ణయ్య టిప్పూల గొప్పదనము చాలవఱకు మరుగుపడియున్నది. సుల్తానునకు ఎడతెగని యుద్ధములకై వలసినధనమును సమకూర్చుటకును, రాజ్యాదాయమును వృద్ధిచేయుటకును, సాధ్యమయినంతవఱకు రాజ్యాంగపుఖర్చులను తగులుబడులు తగ్గించుటకును పూర్ణయ్య యనేకప్రయత్నములు గావించియుండెను. కాని తాలూకా యధికారులును, జిల్లా యధికారులు నగు అమలుదారులును, యుసుఫులును, వసూలయిన సుంకాదాయ మొత్తమునంతయు రాజధానికి బంపకుండ చాలభాగము ఎప్పటికప్పుడే హరించుచు తప్పులెఖల వ్రాయించుచుండుటకతన మంత్రిపూర్ణయ్య యనుకొనినంత ఆదాయం వచ్చియుండలేదు. అయినను ఆయనప్రయత్నములు, పద్ధతులు ఈకాలపు వర్తనీతిజ్ఞులకుకూడ నాశ్చర్యకరములయి యుండుననుటకు సందియము మేమాత్రమును లేదు.

పూర్ణయ్య యెంతటివర్తనీతిజ్ఞుడో, యంతటి నిరుపమాన ధైర్యసాహసములు

గల సైన్యాధ్యక్షుడు. సైనికుల ధైర్యముతో స్థిరచిత్తముతో, సర్వకాలముగ నెట్టి విషమపరిస్థితులందయినను నడుపగల సమర్థుడు. ఒకప్పుడు కలముపట్టిన పూర్ణయ్య ఖడ్గము గూడ దాల్చి విశ్వసనీయుడైన దండనాథుడై కీర్తికెక్కెను. టిప్పుసుల్తాను అపజయము మీద నపజయము నొందుచు సందిగ్ధావస్థయందు చిక్కులు బడుచుండిన కాలమున పూర్ణయ్య చూపిన యసమాన ధైర్యము, యుత్సాహము, మంత్రాలోచనము, సుల్తానునకు అత్యంత ప్రోత్సాహకరము లయ్యెను. నాల్గువేల యారువందల అశ్వదళమునకు పూర్ణయ్య అధిపతిగా నుండెను. ౧౭౯౨వ సంవత్సరమున కారన్వాలీసు ప్రభువు టిప్పుసుల్తాను శిబిరములపై తుపాకిగుండ్లు వర్షము గురిపించుచుండ పూర్ణయ్య సైన్యములకు జీతభత్యములు లీయవలసివచ్చెను. అంతట క్రమక్రమముగా నా దారుణ అగ్నివర్షము వృద్ధియగుటవలన పూర్ణయ్య పని కాటంకమయ్యెను. తన సైన్యమును ఫిరంగులను కాల్చ నాజ్ఞాపించుటకుగాని కదల్చుటకుగాని యవకాశము లేకుండపోయెను. ఆవిషమ సమయమున సుల్తాను సువర్ణభాండాగారము నంతయు నొక చిల్లిగవ్వయైన శత్రుహస్తగతము కాకుండ దాటించి దాచ తలచియుండెను. పూర్ణయ్య ధనమునంతయు సంచులలోనికి నెక్కించి ఒంటెలమీద వైచి చల్లగా నావలకు దాటించెను. స్వయముగా సంచులకు వరహాలెత్తించి మూతలు బిగియగట్టించి సీళ్ళు వేయించుచునవసరమున పూర్ణయ్యకు తుపాకిగుండువలన ప్రబలమైన గాయము తగిలెను. ఆబాధ కోర్చియు లేవజాలనంతటి గాయము తగిలినను మంత్రి పూర్ణయ్య నెత్తిపైనుండి సవ్వారివ్యా ఫిరంగిగుండ్లను తుపాకిగుండ్లను ఎగురుచున్నను బొక్కసమును ఒక దమ్మిడైనను పోకుండ సంచులగుట్టి సురక్షితముగా జేర్చెను. వేరొకసారి ౧౭౯౯వ సంవత్సరమున శ్రీరంగపట్టణము బ్రిటిషు వారియొక్కయు, వారి స్నేహితులయొక్కయు సైన్యములచే ముట్టడింపబడియున్న సమయమున సర్దారు పూర్ణయ్య నాల్గువేలయారువందల యశ్వదళముతో కదిషుట్టుకొని వచ్చి స్టూవర్టు సేనానిశిబిరమును ఫిరంగిగుండ్ల ముంచి తగలబెట్ట సిద్ధమయ్యెను. సర్దారు పూర్ణయ్య ధైర్యసాహసములను యుద్ధకౌశలమును దిలకించిన నాంగ్లేయులు అచ్చెరువంది టిప్పుసుల్తానుతో సంధిషరతులు మాట్లాడుకొనువేళ నాతని మాట ఖరారగునక్కై సుల్తాను యాంతరంగిక మంత్రులతో కమీరుద్దీన్, సయద్ గఫూర్, మీరుసదక్ లతోబాటు, సర్దారు పూర్ణయ్యను గూడ కొదువగానుంచవలసినదని కోరియుండిరి. ఈవిషయము మొక్కటియే పూర్ణయ్యగారి సమరకౌశలమును జాటజాలినది. ఈయన ధైర్యసాహసములను గూర్చిన విశేషాంశములు ఎన్నియోని గలవు. వేయేల శ్రీరంగపట్టణము శత్రువులచేతి బడినతరువాత, సుల్తాను, తనయులు ఇతర సర్దారుల తనయులు మొదలుగా విజయుల శరణుజొచ్చియుండిరిగాని, కడపటివఱకును సర్దారు పూర్ణయ్య మాత్రము శస్త్రసన్యాసముగావించియుండలేదు. (సశేషము)

న్నది. కనుక సంగతియేమిటో బాగుగఁ దెలిసికొనినపిదప నీవాదములు నెఱపి యేదియేని యొకనిర్ధారణము రావచ్చును.

క్రొత్తతెనుఁగు పక్షమువారియొద్దకుఁ బోయి అయ్యా! మీరు నిరసించుచున్న ప్రాఁతతెనుఁ గెట్టిది? దాని యందలి దోషము లెవ్వి? దానియందు మీ కింత యసహ్యము గలుగుటకుఁ గారణ మేమని యడుగవార లొక్కపెట్టున ప్రాఁతతెనుఁగు చచ్చినభాష మా క్రొత్తతెనుఁగు బ్రతికియున్నభాష ప్రాఁతతెనుఁగు పూర్వ మెన్నఁడో పుట్టి పెఱిగిననాఁడు మాటాడునది యది నేర్చుకొనుట బహుకష్టతరము ఒక వేళ శ్రమపడి నేర్చుకొన్నను నిష్ప్రయోజనమని కంఠోక్తిగా వాదించెదరు. ఇఁక ప్రాఁతతెనుఁగు పక్షమువారియొద్ద కరిగి మహానుభావులారా! క్రొత్తతెనుఁగు వారిపై నేల మీ కింత యాగ్రహము వారిభాష యెట్టిదని మీయుద్దేశమని యడుగ ఛీఛీ క్రొత్తతెనుఁ గేమిటి వారినత్తి తెనుఁగుగాని. యది యొక భాషయా, తప్పత్రాగి యొడలెఱుఁగక యిచ్చవచ్చినట్లు ప్రేలు త్రాగుబోతుల భాషయది దానినెట్లు గ్రంథస్థము గావింపవచ్చునని చిఱుబుస్సులాడుచు ముఖము చీదరించుకొందురు. మఱికొందఱు మాధ్యస్థులుగా నున్నవారినీవిషయముఁ గూర్చి ప్రశ్నించినవారుచీకాకుపడక నెమ్మదితోఁ జిఱునవ్వు నవ్వి క్రొత్తతెనుఁగు ప్రాఁతతెనుఁగను వాదమునకు తలతోఁకలు లేవనియు వీరివీరి యభిప్రాయములను స్థిరపఱచుకొనుటకును ఎవరు పట్టినపట్టు వారు నెగ్గించుకొనుటకును పంతములు పూని యుభయపక్షములవారును వాదించుచున్నారే కాని మఱియొకటి కాదని వప్పులాటక్రింద వీరివాదము నంతయు నెగతాళి చేయుదురు. ఇట్టి భిన్నాభిప్రాయములు మనలో మనకే గలుగుచున్నవి కనుక ప్రస్తుతము నిష్పక్షపాతముగా గుణభిన్నానము వదలి దేశమునకును భాషకును మేలుచేయు వలెనని నిక్రించి యంశములను గూర్చి మనము చర్చింపవలయును. వానినే సాధారణములుగా సయితము గ్రహింపవచ్చును.

1 ప్రాఁతతెనుఁగనఁగా ప్రాఁతతెనుఁగు వారి యభిప్రాయ మేమి?

2 క్రొత్తతెనుఁగనఁగా క్రొత్తతెనుఁగు వారి యదార్థమైన యర్థమేమి?

3 ఈయుభయపక్షములవారికి యేయే యంశములలో భేదముగలదు?

4 ప్రాఁతతెనుఁగును విడిచి క్రొత్తతెనుఁగునిప్పుడు పాఠశాలలో బాలురకు నేర్పుటకున్న యవసరమేమి?

5 క్రొత్తతెనుఁగున వ్రాయుచున్న బాలురు క్రొత్తతెలుఁగు వారి యుద్దేశము ననుసరించి వారి నిబంధనలకు లోఁబడియే వ్రాయుచున్నారా?

6 ఈక్రొత్తతెనుఁగువలన బాలురకుఁ గాని భాషకుఁ గాని నిజమయిన మేలు కలుగునా?

7 ప్రస్తుతపుస్థితిననుసరించి బాలురకును భాషకును నష్టములేకుండ చేయుటయెట్లు?

పై నుదహరించిన యంశముల నేడింటిని మనము బాగుగా నాలోచించి యేదియో యొకటి స్థిరపఱచుకొన్న యెడల నీ క్రొత్త ప్రాఁత తెనుఁగుల వివాదము సమాప్తము కావచ్చును. కనుక కాలయాపనము సేయక మొదటిసంగతి నెత్తుకొందము. ప్రాఁత తెనుఁగును గూర్చి క్రొత్త తెనుఁగువారి యభిప్రాయమును వింటిమి కదా. ఇక ప్రాఁత తెనుఁగువారెట్టియుద్దేశముతో నున్నారనిన ప్రాఁత తెనుఁగనగా నది యొక భూతము కాదు. పిశాచము కాదు. మీఁద పడి కొట్టదు. కఱవదు. దానిని దొలఁగించుటకయి దొంతినము వారను మాంత్రికుల సాహాయ్యమక్కఱలేదు. ప్రాఁతవస్తువులు పథ్యమనునట్టిది సర్వజనశ్రేయోదాయకము, ముందు మన పెద్దలందఱు మంచిదని యెప్పటిచి, యవలంభించి, ప్రయోగించి, బాగుగా నలుగఁగొట్టిన బాట గాని మఱియొకటి కాదు. అది ప్రతి మనుష్యునకును వాని యిచ్చవచ్చిన స్వేచ్ఛనీయక, రోగిని వైద్యుఁడు నడపునట్లు కొన్ని నిబంధనలకు లోఁబఱచి జాగ్రత్తగానుంచును. దానివలన మనుష్యుఁడు స్వతంత్రముమాని తన యిచ్చవచ్చిన పదములను దెచ్చి భాషయందు గ్రుచ్చి భాష నపవిత్రము సేయక మునకంటె విద్యయందును బుద్ధియందును నెక్కుడగు నధికులని పేరొందిన పూర్వపుకవీశ్వరులు పండితులు మొదలయినవా రందఱు చేసిన కట్టుబాట్లకు లోఁబడి భాషయందు క్రమమైన మార్గమున నడచును. బాబులారా! అట్టి మంచిమార్గమును దెలిసికొని దానియందు నడచుట తప్పా? సంఘములోని జను లిచ్చవచ్చినట్లు ధర్మాధర్మవిచక్షణ లేక సంచరించిన నాసంఘమెన్నటికైన నభివృద్ధినొందునా? సంఘాభివృద్ధికై ధర్మశాస్త్రానుసరణ మవశ్యకముగదా! అట్లే భాషాభివృద్ధికిని భాషాపవిత్రతకును భాషనుసంస్కరించు వ్యాకరణశాస్త్రానుసరణ మనావశ్యకమని నుడువువారెన్నిగుండెలున్నవారు కావలయును! ఈప్రాఁత తెనుఁగునందును సంస్కృత సమాసములు క్లిష్టార్థములు మొదలయినవి మాని చక్కని మృదుమధురములయిన తేలికపదములతో పెద్దలు నిర్ణయించినప్రకారము నిబాధనలకొడంబడి వ్రాయఁగూడదని యెవరైన నిర్బంధము పెట్టిరా? అట్లు వ్రాసి లోకుల కమితోపకారము సేయుచున్న మహాభావులు లేరా? ఇందుకు తార్కాణముగా బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహము గారి పుస్తకము లీయాంధ్రదేశమునం దాబాలగోపాలము బోధపడుచు హృదయరంజకములై వేయినోళ్ల నాతని నైపుణ్యమును గొనియాడునట్లు సేయుచున్నవి కావా? ఆయన పుస్తకములన్నియు ప్రాఁత తెనుఁగున వ్రాయఁబడియున్నవి కదా! ఇదియే ప్రాఁత తెనుఁగనఁగా నర్థము. ఇదియే క్రొత్త తెనుఁగువారి కుక్కిరిబిక్కిరియై యున్నది. అపుడు నాలుకకు రుచిగానుండి కడుపునకు బాధలు పెట్టించు లడ్డూలకంటె జీర్ణారోగ్యకరమైన చేదెట్టివారికి కుక్కిరిబిక్కిరి యగుటసహజమేకదా! (సశేషము)

# ఆంధ్ర సారస్వతము

[అయ్యలు సోమయాజులు వేంకటసుబ్బారావుగారు ఎమ్. ఏ. ఎల్. టి.]

ఆంధ్ర భాషాభిమానులారా!

ఆంధ్రవాఙ్మయమును సింహావలోకనముగా పరిశీలించి విమర్శనను నేను సూక్ష్మముగా చెప్పుట నా అభిప్రాయము. తెలుగు గ్రంథము లన్నియు సమగ్రముగా పఠించి [illegible] దోషములను విమర్శించు నా నా [illegible] ములలో [illegible] విమ [illegible]

ఆంధ్ర [illegible] నకు [illegible] ను [illegible] ఒకే [illegible] కుప మోగింప నవసరము లేదు. పాశ్చాత్యు లచే మాధుర్యమునకు పేరుపొందినది. అయినను మొదటనుండి తెలుగున గ్రంథములు వెలువడకపోవుటకు కారణ మూహ్యము.

నన్నయయే ఆంధ్రపద్యరచనకు ప్రథముడని కొందఱి అభిప్రాయము. మొదట ఆంధ్రకవులుండిరనియు వారెన్నో గ్రంథములను వ్రాసి ప్రపంచమున కీయకుండిరనియు కొన్ని నాశమయ్యెననియు ఇతరు లనుకొనుచున్నారు. నన్నయకు పూర్వము నన్నిచోడు డుండెనని మఱికొందఱి ఊహ. మహమ్మదీయులచే ధ్వంసము చేయబడెనని కొందఱూహించుచుండిరి.

ఏది ఎట్లున్నను నన్నయభారతమే తెనుగులోని మొదటిగ్రంథము. "[illegible] మహిమన్ వాగనుశాసనుండు సృజియించెన్" అను రాజరాజభూపాలుని పలుకు కొంతవరకు నిజమే. నన్నయ ఛందస్సును నిర్మించి తెలుగుపద్యములను వ్రాయుటకు మొదలిడకపోయినను గ్రంథ [illegible] నాంధ్రలోకమున తెలుగు కవన [illegible] టించిన మహోపకారి. ఆంధ్ర [illegible] యు సాహ [illegible] న్నయను [illegible] లు వ్రా [illegible] దేశకవితా [illegible] విషయం [illegible] పూర్వ [illegible] వివాదము [illegible] హగును. [illegible] నారం [illegible] ముగు మాట మచ్చి ఆంధ్ర [illegible] మొదటి కావ్యము రచించి దేశమునకు ఎక్కువ ఉపకారము చేసెను.

లక్షణముండియు కవితయుండియు ఆంధ్రులు కావ్యములను ఏల వ్రాయలేదో చూతము. మతగ్రంథము లన్నియు బ్రాహ్మణాధీనమై యుండెను. అవి సంస్కృతము లో నుండెను. గీర్వాణభాష నభ్యసించి వానిని పఠించుట సులభసాధ్యము కాదు. కాబట్టి గ్రంథములన్నియు గోప్యముగా రక్షింపబడుచుండినవి. విద్యాధికులు దేశభాషను వృద్ధిపఱచుటకు యత్నింపలేదు.

దేవభాషనే పరమావధిగా నెంచుచుండిరి. బ్రాహ్మణేతరులకసాధ్యములగు పద్ధతులను అవలంబించుచుండిరి. దానశాసనములను సయితము గీర్వాణభాషలోనె వ్రాసిరి. నందమపూడిశాసనము యుద్ధమల్లునిశాసనము లయినను పూర్తిగా తెనుగున లేవు. శాసనములనాటికి ఆంధ్రులకు స్వభాషాభిలాష పుట్టుచుండెను. తెనుగుకవితావ్యక్తి వ్యక్తమగుచుండెను. విద్యావంతులు పద్యములను వ్రాసి ప్రకటింప సాహసించిరి. పైనుడివిన శాసనములె దృష్టాంతము.

ఇంతియకాక జైనబౌద్ధమతస్థులు మతప్రచారము గావించుచుండిరి. మాగధ్యాది వాడుకభాషలలో మతగ్రంథములను వ్రాసి ప్రజల చిత్తముల నాకర్షించుచుండిరి. దక్షిణహిందూదేశమున కూడ ప్రచార మారంభించుచుండిరి. మతము నుద్ధరించు సమయము దాక్షిణాత్యులకు తటస్థించెను. కాబట్టి మతవిషయములు స్వభాషలో వ్రాసిన గాని వీలులేదు. లేని యెడల మొదటికే మోసమువచ్చునేమో.

దేశభాషలు వృద్ధినొందు సమయమే తెంచెను. దేశస్థులగు పండితులకు స్వభాషాభిమానము హెచ్చుగుచుండెను. మతధర్మములను కులాచారవిషయములను నీతులను బోధించు గ్రంథములు వెలువడవలసిన తరుణము తటస్థించెను. పంచమవేదమను ప్రసిద్ధిగాంచిన భారతమును దేశభాషలో వ్రాసిన అన్నివిధముల బాగుండునని తలంచి భారతాంధ్రీకరణ మారంభమయ్యెను.

కాని నాటికవులు సంస్కృతపండితులు. శాస్త్రముల నభ్యసించిరి. సంస్కృతభాషాకట్టుబాట్లను సాంస్కృతిక ఛందోవిషయములను గీర్వాణభాషాపదములను తెనుగున నిరాఘాటముగ నుపయోగించుచుండిరి. సంస్కృతసాంప్రదాయముల ననుకరించుచుండిరి. ఉత్కృష్టగ్రంథము లన్నియు గీర్వాణభాషయందుండుటచే పాఠకులు వానిని స్వభాషలలో తర్జుమా చేయ యత్నించుచుండిరి.

కాబట్టి ఆంధ్రమున మొదట రచియింపబడిన గ్రంథములు భాషాంతరీకరణములును పురాణములును. వానిలో మొదటిది

సీ. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్షణంబనియును
నైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ"
(భారతము)

భారతాంధ్రీకరణము నారంభించిన మహాత్ముడు నన్నయ. ఇతను రాజరాజనరేంద్రుని ఆస్థానకవి. ఉభయభాషాపండితుడు. నిర్దుష్టముగ కవనముచేయగల ప్రతిభాశాలి. వాగనుశాసన బిరుదాంకితుడు.

ఆంధ్రవాఙ్మయ సౌధనిర్మాత. నన్నయ భారతములోని ఆదిసభాపర్వములును అరణ్యపర్వములో కొంతవఱకును తెనిగించెను.

నన్నయభారతమును పూర్తిగా ఆంధ్రీకరించుటకు పలువురు పలువిధముగ పలికిరి. నన్నయ ౩పర్వములన్వ్రాసెనని తిక్కన విరాటపర్వాదిని "మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు విద్యాదయితుండొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్" దీనికి పలువురు వివిధముగ వ్యాఖ్యానములుచేసిరి. రమారమి అవి కొందఱర్థము చేసిరి. తిక్కనసోమయాజి స్పష్టముగా వ్రాసియుండగా సందేహమురా కారణమేమి?

భారతాంధ్రీకరణమున నన్నయకు నారాయణభట్టు సాహాయ్య మొనరించెనని చెప్పబడియున్నది. దీనికి కృష్ణుఁడు ఏమిచేయకయున్నట్లు నారాయణభట్టు ఉండెననెడి ధ్వని స్ఫురించవచ్చునని కొందఱి యభిప్రాయము. కృష్ణుడు లేనిది పాండవులను జయప్రాప్తి కలుగునా, కృష్ణసాహాయ్యము లేనిది పాండవులకు యశోప్రాప్తి యుండునా రంధ్రాన్వేషణము పెడఅర్థములు తీయ మొదలుపెట్టిన లోటులేనివారెవరు. నన్నయకు నారాయణుఁడు తోడ్పడుట నిజమె. అతనే చెప్పుకొనునపుడు దానిని విశ్వసించుట మనపని.

నారాయణసాహాయ్యమున నన్నయ భారతము నాంధ్రీకరించుటలో మక్కికి మక్కి తర్జుమాచేయలేదు. మూలము ననుసరించి తెనిగించెను. అవసరమగుచోట్ల మార్పులుచేసెను. కవనమున కనుకూలముగ విశేషములను వాడెను. భాషాంతరీకరణములో మూలాభిప్రాయములనే గైకొనిన బాగుండును. కాని అసలుకు సరియగు నకలంత తర్జుమా చేయుటకు సిద్ధపడుట చాల కష్టము. చేసినను కృత్రిమాకారమును పొందునుగాని ఆకృతి ఇంపుగా గాన్పించదు. నన్నయభట్టే కాదు సంస్కృతమును తెనిగించిన ఆంధ్రమహాకవులందఱును అవసరమగుచోట్ల స్వతంత్రులుగా నుండిరి.

వాగనుశాసనుఁడు భారతమున్వ్రాయుటలో కళాకౌశలమును చూపెను. సంస్కృతభాషాపాండిత్యము సమగ్రముగ కలిగియుండుటచే నన్నయ సంస్కృతపదములను మెండుగా నుపయోగించెను. సంస్కృతపదభూయిష్ఠమైనను ఇతని శైలి కఠినముగా నుండదు. రానురాను కవులు సాంస్కృతికదీర్ఘసమాసములను వాగాడంబరముకొఱకుపయోగించిరి. నన్నయప్రయోగించినవానియందు అట్టిది లేదు. ఒక్కొకచోట తిక్కనవాడిన తెనుగుపదములే నన్నయ ఉపయోగించిన గీర్వాణపదములకంటె కఠినములుగ నుండును. నన్నయసంస్కృతపదములు ఆడంబరముగా అగుపించినను అర్థవిషయమున అటుల ఉండవు. అర్థకాఠిన్యమట్టిచోట్ల ఉండదు.

1. భారత భారతీశుభగ
    భస్త్రిచయుంబులం జేసి ఘోరసం
  సార వికార సంతమస
    జాల విజృంభము వాపి సూరిచే
  తో రుచిరాబ్జబోధన ర
    తుండగు దివ్యపరాశరాత్మజాం
  భోరుహ మిత్రుఁ గొల్చి ముని
    పూజితు భూరియశోవిరాజితున్

2. సాత్యవతేయ విష్ణుపద
    సంభవమై విబుధేశ్వరాబ్ధి సం
  గత్యుపశోభితంబయి జ
    గద్విదితంబగు భారతీయ భా
  రత్యమలాప గౌఘము వి
    రంతర సంతత పుణ్యసంపదు
  న్నత్యభివృద్ధి సేయు విని నం
    గొని యాడిన నెల్లవారికిన్

3. ఆనారాయణ పాండవేయ
    గుణ మాహాత్మ్యమలజ్యోత్స్నఁ జి
  త్తానందం బానరించు చున్
    జనుల కర్థాంశు ప్రకాశంబుతో
  మానై సాత్యవతేయ ధీ
    వనధిజన్మ శ్రీమహాభారతా
  ఖ్యానాఖ్యామృత సూతియొప్పు
    నిఖిలాఘధ్వాంత విధ్వంసియై

పై పద్యములలో సంస్కృతపదము లున్నను అన్వయకాఠిన్యము లేదు. సులభముగ ద్యోతకమగు అలంకారమున్నది. నన్నయ ఉపమరూపకములనె వాడును. శ్లేషయందు ప్రీతి తక్కువ. ఒకటిరెండు చోట్ల శ్లేష నుపయోగించెను. అక్కడక్కడ శ్లేష యున్నను నన్నయ శ్లేషార్థము నూహించకయె పదప్రయోగము చేసి యుండును. నన్నయ ప్రకృతివర్ణనవల్లను యుద్ధవర్ణనసమయంబునను, వీరరసము, క్రోధము చూపవలసినచోట్లను సంస్కృతసమాసములను వాడుటయేగాక సందర్భానుసారముగ అక్షరముల నుపయోగించును.

సభాపర్వమున—

“మదోద్ధురుఁడై ద్రౌపదినిట్లు సేసిన ఖలున్
    దుశ్శాసనున్ లోకభీ
  కరలీలన్ వధియించి తద్విపుల వ
    క్షశ్శైలరక్తౌఘ ని
  ర్ఝర ముర్వీపతి చూచుచుండ నా
    స్వాదింతు నుగ్రాకృతిన్”

“............
    ...యుద్ధురాత్ము దు
  ర్వార మదీయ బాహు పరి
    వర్తిత చండ గదాభిఘాత భ
  గ్నోరు తరోరుఁ జేయుదు సు
    యోధను నుగ్ర రణాంతరంబునన్”

పాత్రపోషణమున నన్నయ నేర్పరి. పాత్రప్రతిమ ప్రత్యక్షమగునటుల విశేషణముల నుపయోగించును.

“పరమపతివ్రతల్ పతిఁ ద
    పస్వినిఁ బాండవధర్మపత్ని ధ

ర్మగతి న మోనిజం బ్రకృతి
మానవభామినిఁ గాఁదలఁచి"

"పుణ్యతపోమయుండు ముని
పూజ్యుఁడు బ్రహ్మనముప్రభుండుబ్ర
హ్మణ్యుఁడు బ్రావృషేణ్య జల
దాసితవర్ణుడ శేషకిల్బిషా
రణ్యదవానలుండగు ప
రాశరనందనుఁ డేగుదెంచె ద
త్పుణ్యచయస్వరూపమును
బోలెఁగ వంబుమనో మదంబుగన్"

ఖాండవ వన దహనసమయమున కురియు వర్షము కట్టెగుర నున్నట్లు కానిపించుటకు

"ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు
వఱలఁగ నలుగడలఁబడనవారితవృష్టుల్
గుఱుకొనికురియఁగఁ బంచెను
మెఱయును నయ్యనలుమీఁద మఘవుం
డలుకన్"

ఱ, ల కారములు అనుకరణధ్వనులు

వాగనుశాసనుని వచనములు అర్థకాఠిన్యములు కావు. ప్రకృతి వర్ణనలపట్ల యుద్ధరంగము వర్ణించుతరి దీర్ఘ సమాసముల నుపయోగించును. సంభాషణనమయముస సులభముగా వ్రాయును.

1 నీవు మాకు నుపకారంబు సేయ నోపుదేని నేము నీకుఁ గ్రమాక్రమంబున నబ్బుటప్పుడు......

2 నీపరాక్రమంబునకు మెచ్చితి నీ తోడి సఖ్యంబు నాకభిమతంబయినయది నాతపంబునం బడయంబడిన చాక్షుషీ యను విద్య నీకిచ్చెద దీనిం దొల్లి మానువు వలన సోముండు వడసె......

3 నాగకన్యక యర్జునుంజూచి ద్రుపదరాజ పుత్రియందు మీరుచేసిన సమయంబును భవత్తీర్థాగమన నిమిత్తంబును వ్రతంబును నెఱుంగనిదానఁ గాను......

అరణ్యపర్వములో నన్నయ కవిత్వమంత పటుత్వముగా లేదనియు రోగబాధ చేతనో చిత్తనైకల్యముచేతనో బుద్ధిబలము తగ్గియున్నప్పు డది చేయుబడియుండవచ్చునని యు వీరేశలింగముగారు వ్రాసిరి. కాని దీనియందు యాదార్థ్య మంతగా లేదు. నన్నయ భారతాంధ్రీకరణపు విషయమగు పుక్కిటిపురాణములను బట్టియు అరణ్యపర్వ రచన అసంగికరమనెడి వదంతి ననుసరించియు అరణ్యపర్వములోని కవన మంత రసవంతముగా లేదని పంతులుగారు వ్రాసియుందురేమొ. అరణ్యపర్వమున వచనములు ఎక్కువగా నుండుటచే పద్యములు వ్రాయ శక్తిచాలక గద్యలనే వ్రాయ తటస్థించెనని కొందఱియూహ. అరణ్యపర్వములో చాలవఱకు ధర్మములు, సంవాదములు, పుణ్యపురుషుల చరిత్రలు చెప్పబడియున్నవి. వీనికి వచనమంతనులువుగా పద్యముండదని నన్నయ తలచియుండవచ్చును. పద్యముకంటె గద్య నీరసము కాదు. శ్రావము

ప్రధానము. (నాలుగు గణములను చేర్చి యతికొఱకు ప్రాసకొఱకు అక్షరములను కుద్దించియు సాగదీసియు వ్రాసినంత మాత్రమున పద్యము కానేరదు) దీర్ఘవర్ణనలు ధర్మవిషయములు ఆధ్యాత్మికవిషయములు వచ్చువోట్ల కవులందరు వచనము సులువుగా నుంచుదురని ఉపయోగింతురు. అంత మాత్రమున వారిప్రతిభకు కళంకము తెచ్చుట న్యాయముకాదు. నన్నయ వ్రాసిన ఆఖరుపద్య మొకటిచదివిన అతని కవిత్వపు బిగి తగ్గలేదని యూహింపక వీలులేదు.

నన్నయ భారతమొకటే వ్యాకరణ మొకటి వ్రాసెననియు ఆకారణమున వాగనుశాసన బిరుద మీయబడెననియు కొందఱి యూహ. ఆంధ్రశబ్దచింతామణి నన్నయకృతి కాదనియు నన్నయ శబ్దశాసనబిరుద మందుకు రాలేదనియు విమర్శకులు వ్రాసియేయుండిరి. (సశేషము)

# నైజాంగవర్నమెంటులోని హైద్రాబాదు ఆర్షవిచారశాఖ

[ కంభంపాటి అప్పన్నశాస్త్రిగారు ]

హైద్రాబాద్‌నందు నైజాంగవర్నమెంటువారీశాఖను క్రీ॥ శ॥ ౧౯౧౪ సం॥ లో స్థాపించి నిజాంరాష్ట్రమునందలి ప్రాచీనవస్తుచారిత్రయందొక నూతనశకమును కల్పించిరి.

పూర్వమునుండియు నిజాంరాష్ట్రమునగల ప్రాచీనవస్తుసంరక్షణవిషయమై నైజాం దొరతనమువారు తగినశ్రద్ధను గనపరచుచునే వచ్చిరి. కాని ప్రత్యేకశాఖ యొకటి లేనికారణమున ఈవిషయమై అంతగా పని జరిగియుండలేదు. యింతవరకు ప్రాచీన వస్తుసంబంధమైన వ్యవహారమంతయు పబ్లిక్ వర్క్సుడిపార్టుమెంటు(P.W.D) క్రిందనే యుండెను.

ఈ రాజ్యమందు దొరికిన ప్రాచీన వస్తుసామాగ్రివిమర్శనము బొంబాయి రాజధానికి జెందిన ఆర్షవిచార పరిశోధకునివద్ద నామమాత్రముగా నుంచబడియుండెను. ప్రాచీనకట్టడములను మంచిస్థితిలో నుంచుటకై పబ్లిక్ డిపార్టుమెంటువారు యెంత కృషి సలిపియున్నను, ఆవిషయములందు శ్రద్ధగల విదేశీయపరిశోధకులు మాత్రము వానివిషయమై ఇంకను ఎక్కువశ్రద్ధగైకొని వానిని మంచిస్థితిలోనుంచుటకు నైజాం దొరతనమువారిని హెచ్చరించుచు వచ్చిరి.

నిజాంరాష్ట్రమున గల పరిశోధన కార్యమునందు పాల్గొని ఆవిషయములను గురించి అనేక చారిత్రకసంగతులను ఇతరవిషయములను బైటబెట్టినవారిలో ఈ క్రిందివారు గలరు.

1 సర్ చార్లెసమాలెట్. 2 కర్నల్ సైక్సు. 3 కర్నల్ మెడోస్‌టెయిలర్.

4 కెప్టెన్ నిల్. 5 సీల్. 6 వేల్సు. 7 ఫెర్గూసన్. మొదలగు నాకొంత ప్రాచీనులును. 8 జేమ్సుబర్గెస్. 9 జాన్ గ్రిఫిత్ 10 లేడీ హేరింగుహామ్ మొదలగుఆధునికులునునై యున్నారు.

వీరందరును పైన వ్రాసినట్లు నిజాం రాష్ట్రమునందు గల ప్రాచీననిర్మాణవస్తు పరిశోధలందు గట్టిపనిచేసి అనేక నూతన విషయములను వెల్లడిపరచి తర్వాతి పరిశోధకుల కెంతయో సహాయముచేసిన వారైయున్నారు.

నిజాం దొరతనమువారిచే నియమింపబడి పై వారినలిసి పనిచేసిన ఈక్రిందివారిని ఈసందర్భమున పేర్కొనవలసియున్నది.

1 నవాబు సయ్యదు హుసేను బెల్గ్రామీగారు. (వీరువ్రాసిన గ్రంథముపేరు హిస్టారికల్ అండ్ డిస్క్రిప్టివ్ స్కెచ్ ఆఫ్ హెచ్. హెచ్ ది నైజామ్సుడొమినియన్సు)

2 అవురంగాబాదు గెజటియర్ అను గ్రంథమును అనేకులు కలసి వ్రాసియున్నారు.

ఇండియా దొరతనమువారిచే నియమింపబడిన మిస్టర్ హెచ్ కజెన్సుగారు నిజాంరాష్ట్రమున గల చారిత్రకస్థానముల పట్టిక ఆయాస్థలవిశేషములను సంక్షిప్తముగా తెలుపుచు వ్రాసియున్నారు.

మొదట వ్రాయబడిన పరిశోధకుల హెచ్చరికలువిని నిజాం దొరతనమువారును ఇండియా ఆర్షవిచారశాఖాధ్యక్షులగు సర్ జాన్ మార్షల్ గారితో ప్రత్యుత్తరములు జరుపగా బెంగాలు విద్యాశాఖకుచెందిన మిస్టర్ జి. యాజ్దానీగారిపేరు తెలుపుచు వీరిద్వారా ఆర్షవిచారశాఖానిర్వాహణము కొనసాగింప వారు సలహానిచ్చిరి.

వెంటనే నైజాం దొరతనమువారు ఆ 1914 జూన్ 7 వ (22 అమర్దాదు ౧౩౨౩ ఫసలి) నాడు ఆర్షవిచారశాఖ యొకటి నిర్మింపబడినట్లు ప్రచురించి ఆశాఖకు పైన వ్రాసిన జి. యాజ్దానీగారికి సూపరింటెండెంటుగా పనిచేయ నాహ్వానించిరి.

మిస్టర్ జి. యాజ్దానీగారును ఆ1914 యేప్రిల్ 1వ తారీఖున తాము పనిచేయుచున్న రాజషాహి కళాశాలనుండి విముక్తబడినవారై హైదరాబాదునకు వచ్చి ఆ 1915 జూన్ 27 వ తారీఖున నైజాం దొరతనమువారి అనుమతిపై ఆర్షవిచారశాఖయందు సూపరింటెండెంటుగా ప్రవేశించిరి. వారిశాఖయందు చేయవలసిన కార్యనిరూపణచేసి దొరతనమువారు వారికొఱకు ప్రత్యేకఆఫీసును కల్పించిరి. వీరికి సహాయముచేయుటకుగాను కొందరు ఉద్యోగస్థులను యేర్పాటుచేసిరి. వారిలో మిస్టర్ అతావుర్ రహిమాన్‌గారినిగుమాస్తాగాను యం ఇ. ఫ్రామ్సుగారిని టైపిస్టుగాను సుల్తాన్ అలిఫారూఖిగారిని ప్లానులు గీసేవారినిగాను నియమించియుండిరి. సూపరింటెండెంటుగారు చేయవలసిన కార్యక్రమము ఈక్రిందివిధముగా నుండును.

1 నిజాంరాష్ట్రమున గల చారిత్రబోధకములగు ప్రాచీనవస్తువులను జాగ్రత్తచేసి యుంచుట.

2 దేశచరిత్రను సూచించు ఆధారములుగల ప్రదేశములను త్రవ్వించుట.

3 ప్రాచీనవస్తువులను ఒక్కచో ప్రోగుచేసి సక్రమమనుయిన పద్ధతిలో చేర్చియుంచుట.

పై కార్యకార్యక్రమములను అమలులో నుంచుటకు సూపరింటెండెంటుగారు క్రింద పద్ధతులను అవలంబింపవలయును.

1 సంరక్షణ

అర్కివిచార సూపరింటెండెంటుగారు సక్రమముగా పరిశోధనకై యాత్రలు చేయుచు బాగుచేయింపదగినవని తమకు దోచిన ప్రాచీనకట్టడములనుగురించి క్లుప్తముగా నోట్సు తయారుచేయుచుండవలెను. ఆనోట్సులో వీని పూర్వచరిత్ర, శిల్పనైపుణ్యము, వర్ణన, వానినాశనకారణములు, అవి యిప్పు డెవరిస్వాధీనములో నున్నవో మున్నగు విషయములను వ్రాసియుంచవలెను. వానిలో జోక్యము గలిగించుకొనుటకు ముందు గవర్నమెంటువారు ఆలోచింపదగిన విషయములు మున్నగునవి తెలుపవలెను.

సూపరింటెండెంటుగారు సిఫార్సుచేసిన విషయములు, అర్కివిచారశాఖవారి యనుమతి బడసినచో వానివ్యయమదింపు, పిలాన్సు, వర్కుసు శాఖచే తయారుచేయబడి సూపరింటెండెంటుగారివద్దకు వారిపరిశీలనకై పంపబడి తమసమ్మతిని తెలుపువారి సంతకమందు చేయవలెను.

అప్రకారముగానే ప్రాచీనకట్టడములను బాగుచేయించుటకై పబ్లికువర్కుసువారుగాని ఈరాష్ట్రమునందలి మరి యితర ఉద్యోగస్థులుగాని తయారుచేసిన వ్యయముల మదింపు (Estemate) సూపరింటెండెంటుగారి పరిశీలనకు పంపబడి వారిచే సంతకము చేయబడవలెను.

బాగుచేయింపబడుచున్న ఆయా స్థలములకు సూపరింటెండెంటుగారు సాధ్యమైనన్ని సారులు పోయి పరిశీలనగావించుచుండి పరిశీలనాఫలితములను అవసరమని తోచినచో దానియందు నియోగింపబడిన ఇంజనీరుగారికి తెలుపుచుండవలెను.

ఏపనియైన ముగింపబడినతరువాత ముగింపబడినట్లు యోగ్యతాపత్రముపై అర్కివిచార సూపరింటెండెంటుగారును పబ్లిక్ వర్కుసు డిపార్టుమెంటువారునుగూడ సంతకము చేయవలెను.

2 త్రవ్వించుట

సూపరింటెండెంటుగారు ఏప్రదేశమునైనను త్రవ్వించుటకు ముందు ఆకార్యముయొక్క మంచిఫలితములనుగురించి గవర్నమెంటువారిని మెప్పించి వారియధికారమును బొంది మరియట్లు చేయవలెను.

3 ప్రోగుచేయుట

సూపరింటెండెంటుగారు తమ ఇతర విధులతో బాటు, సాధ్యమైనన్ని ప్రాచీనవస్తుసముదాయమును ప్రోగుచేయుటలో మిక్కిలి శ్రద్ధవహించి, వానిని కాపాడుటకై చేయవలసిన మార్గములను గవర్నమెంటువా

రిక తెలియజేయుచుండెను. నాశవస్తువులైనను తీసుకొనుటకు ముందుగా ఏమతిసంబంధమైన ఆటంకములు లేవని, రివిన్యూశాఖవారిచే ఖాయపరచబడునంతవరకు వారి నా స్థలములనుండి తొలగింపగూడదు.

ఇతరగవర్నమెంటు ఉద్యోగస్థులు, సూపరింటెండెంటుగారికి తగు సహాయము చేయుచుండవలెను. ఈయుద్యోగులు లేదైన ప్రాచీనముగు వస్తువు బయటబడి గోచరించినచో వారు తిన్నగా ఆర్షవిచారశాఖ సూపరింటెండెంటుగారికి తెలియజేయువలెను.

పై ఉద్యోగస్థులు, ప్రాచీననిర్మాణములను, దేవతావిగ్రహములను పడగొట్టుట లేక నాశనము చేయుట, శాసనముల పైయుండి అవి వ్రాసి మరుగుపరచుట మొదలగు దుండగపుపనులు చేయువారిని జాగ్రత్తగా గనిపెట్టి అపరాధులను శిక్షించుచుండవలెను.

పై విధులన్నియు సూపరింటెండెంటుగారిని ఏర్పరచిన మొదటిసంవత్సరపువి.

నైజాంగవర్నమెంటువారు ఆర్షవిచారశాఖ స్థాపించిన వెంటనే హైదరాబాదులో నొక మ్యూజియము తెరువ ఐరోపా యుద్ధమునకు పూర్వమే తీర్మానింపబడినది.

దీనితోబాటు హైదరాబాదునందు ఆర్షవిచారసంఘ మొకటి, అప్పటి హైదరాబాదునందున్న రెసిడెంటుగారగు ఆనరబుల్ అలెగ్జాండర్ ఫిన్స్. కె. సి. ఎస్. గారి ప్రేరేపణవలన స్థాపింపబడినది. ఈసంఘమును గురించి మరొకసారి ప్రత్యేకముగా వ్రాయదలచినాము.

ఆర్షవిచారశాఖా ప్రచురణములు

1 సాంవత్సరికనివేదిక ఇందు ఈశాఖవారొనర్చిన కార్యములును, ఖర్చులు మొదలగువానిని సంక్షేపముగా తెలుపబడును.

2 మోనోగ్రాఫ్ హైదరాబాదు ఆర్షవిచారశాఖా ప్రచురణములను పేరుతో, క్రొత్తగా గనిపెట్టబడిన స్థలములయొక్కయు, శిల్పములయొక్కయు, ఫొటోలు ముద్రింపించి ప్రచురింపబడును.

పైనిమాత్రమే గాక ఆర్షవిచార సూపరింటెండెంటుగారు హైదరాబాదు ఆర్షవిచారపత్రికలు కొన్నివ్యాసములు వ్రాయుచుందురు.

ఈ ఆర్షవిచారశాఖకు సంబంధించిన ఒక లైబ్రరీగలదు. అందు పరిశోధన విషయమై వెడలు అనేక పత్రికల సంపుటములు, చరిత్రములు చేర్పబడుచుండును.

ఇంతవరకు నైజాం దొరతనమువారు స్థాపించిన ఆర్షవిచారశాఖను గురించి వ్రాయబడినది. మరియొక వ్యాసమునందు ఆశాఖ యింతవరకు చేసిన కార్యములు, వివరములను తెలుపుదుము గావున నీవ్యాసమును ఇంతటితో ముగించుచున్నాము.

మా కొమాళ్ళను భార్యను విజయరామరాజుగారి దగ్గరనుంచి ఆయనకూ మకూ మించి సమ్మతిలేదంటే యేలాగున సరిపడుతుంది. గనుక మా చిన్నవాండ్లను వెళ్లి పిలిపించి సింహాచలంలో మా దివాణం వున్నది గదా అక్కడ కోటగా ప్రవేశ పెట్టి ఉంచితే మాకు ఇష్టమైనట్టు అని అన్నారు. అందుమీద శీతారామ రాజుగారు తమకు మాటుకు అయినవన్నీ సింహాచలపతిరాజు గారి పేరను ఉత్తరం వ్రాయించి నిన్నుగన్న మా తల్లి దాన్నిలున్నా విజయరామరాజుగారి చేతను శలవు తీసుకొని సింహాచలం ప్రవేశించుమని వ్రాయించేసరికి న్నీ సింహాచలపతి రాజు ఆ వుత్తరం తీసుకొని విజయరామరాజుగారి సన్నిధికి పోయి వుత్తరం అనుసరించి శలవు అడిగేసరికి ఆయనకు బహుకోపం వచ్చి ఈక్షణం వెళ్ళుమని శలవు యిచ్చి వారి సామానులు తీసుకపోవడానికి మజూర్లు ఎడ్లు వగైరా ఇచ్చి సింహాచలం పంపించినారు. వీరు ఇట్లా ఉండగా తదనంతరం విజయరామరాజుగారి వర్తమానం కోట విజయరామరాజుగారికి విడిచిపెట్టి రాణివాసస్త్రీలను పద్మనాభంలో ఉంచి రాజుగారు విశాఖపట్నంలో వుండేవరకు అప్పుడు రాజుగారికి మీరు నెలకు పన్నెండువేల రూపాయిలు దివాణం జమాబందీ కట్టమని శలవు ఇచ్చినారు. గనుక ఆమాటలు రాజుగారు వొప్పుకొని యేలాగైనా కుంఫిణీవారి బాకీ తీరుసేచాలునన్న తాత్పర్యం చాలినా వాళ్ళ నెలలు ఉండగా వకనాటి సమయమందు కుంఫిణీవారికి రాజుగారికి మించి మాటలు వచ్చి తమ విశాఖపట్నంలో తమ దివాణం ఉన్నారు గనుక ఇందునుంచి అక్కడ ఉండక లేచివచ్చి కోటలో ప్రవేశించినారు. తరువాత మూడు నెలలకు రాజుగారికి చెన్నపట్నం వెళ్ళమనేవఱకు రాజుగారు మాకిక్కడ చెన్నపట్నంలో ఉండనే ఉన్నారు. వారి మూలంగాను జనాలు సొమ్ము జగ్గకూ ఉన్నది. నేను మేము వెళ్లి యెక్కడమాటలు మాట్లాడవలసినది యేమి ఉన్నది. మేము యిక్కడనుంచి ప్రయాణం అయిపోవడమ్ము వాల్లింటికుల రూపాయిలు ఖర్చుకు కావలసివస్తుంది. తా వాల్లింటికుల ఉంక్ష్మే కుంఫిణీవారికి బాకీ తీరికోను యింతమాత్రానికి మేము చెన్నపట్నం వెళ్ళ నిమిత్యం లేదు. పోంమనుమన్నారు. తిరుగా క్యాపిటను ధోరవారు అన్నమాటలు. మీ సమస్తానం యిర్వైదాన్కు కుంఫిణీవారి శలవులేదు. గనుక ఇర్వైదాన్కు విమోక్యం లేదు. మీరు ఖట్టిగా చన్నపట్నం వెళ్ళవలసు. మరేమయినా ఖర్చులు లేదని అంటే ముప్పయివేల రూపాయిలు మీరా పదిమజిలీలు వెళ్ళేవరకు కావలసినంత ఖర్చుకు పంపిస్తూ యున్నాము. వెళ్ళమనిరి గనుక ఆయనప్పయివేల రూపాయిలు తెప్పించి వారి ఖర్చులకు ఇప్పించి అక్కడనుంచి విశాఖపట్నానకు మూడుక్రోసుల మేర సింహాచలందగ్గిర డేరాలు వేయించుకొని దిగేవఱకు కుంఫిణీవారు తమ జాస్వానా గుంత్ని రామజోగివంతులను పిలుపించి వారితో ఇది రాజుగారు చెన్నపట్నం పోయేమార్గం విడిచిపెట్టి విజయనగరం మార్గం పట్టినారు. వీరు చన్నపట్నం వెళ్ళేటట్టు కనుపించదు. ఇద్దు యేమి ఆలోచన అని క్యాపిటను ధోరవారు అడిగేసరికి రామజోగి పంతులు నేన వెళ్ళి రాజుగారికి చెన్నపట్నమార్గం పట్టించివస్తానని రెండుఘూట్ల శిపాయీలను కూడా తీస్కుని అతిత్వరగా రాజువద్దికి వచ్చి వారి దర్శనం చేసి అన్నమాటలు. యేమంటే క్యాపిటనుధోరవారు మిమ్ములను చన్నపట్నం పంపించి రమ్మని శలవు యిచ్చినారు గనుక మీతో మనవిచేసేటందుకు రావడమయ్యినది. ఆవే అర్జు చేసేవరకు మహారాజులుంగారు ఆమాటలకు శాంతపెట్టి శలవు యిచ్చినమాటలు. మేము చిన్నవాండ్లను చూచి బహుదినములయింది. గనుక వకమారు కన్నులజూచి మరీవెళ్ళుతాము అనేవఱకు అనుర్నారుడు ఖామకా, యీక్షణమందు మిమ్మును చెన్నపట్నం పంపించిరమ్మనుమని కుంఫిణీవారి శలవు అయింది. యీ క్షణమందు చెన్నపట్నం త్రోవలో డేరాలు వేయించక గాని అనుకూలం కాదని ఖట్టిగా చెప్పేవఱకు రాజుగారికి మహాకోపం వచ్చి యీ దుర్మార్గుని తలకొట్టుమనిరి. గనుక అప్పుడు విజయగోపాలరాజు అనే సరదా

రును రాజాగారి సమీపానకు వచ్చి మహాప్రభో యినను యెంత దుర్మార్గుడయినా బ్రాహ్మడు. తమరు చేయించిన్ని ధర్మకార్యాల్లో యిటువంటి పనివిచారించివంతగా లోకంలో నింద్యాస్పదం వస్తుంది. స్త్రీల్కీయాల్లో హానివస్తుంది, క్షమించవలెనని విన్నపం చేసినాడు. గన్కు తియగా రాజాగారు శెలవుయిచ్చినది. యీఫాడీ మన సమస్తానంలో వగ్గుపాలు జేశీను త్రాగి యిదివరకూకా మనదగ్గ నౌకరీచేసి యిప్పుడు మన యెందు ద్రోహచింతలవి మన మర్మం యెరుకల్తూ కంఫిణీవార్కి చెప్పి రవంతసైనా విధియంలేకుండా యిన్నిమాటలువాహాజూరుకవచ్చి మనవిచేసినంద్కు వీణ్ని యేమిపనిచేసినా దోషంలేదు. పోనీని శెలవుయిచ్చి అర్ద్రహృదయుడు గన్క అంతలో పశ్చాత్తాపం వచ్చి సంకెళ్లు వేసి తీస్కొనమని శెలవుయిచ్చి తమ చిన్నవాండ్లు యెావత్తూ పద్మనాభంలో వుండగా అక్కడికివెళ్ళి ప్రవేశించినారు. ఈ॥ అక్కడ రెండునెలలు ఉన్నంతలో శ్యామీయుదనోరవారు యీసంగతి బోరటువార్కి వ్రాసినారట. అక్కడనుంచి యేమిఖర్ది వచ్చిందో తెలియదు. కర్నల్ పిడిగ్గాను అనేకకంపిణీ సర్దారును రెండుపటాలాలవారు ఫిరంగుల సమేతంగా వచ్చి రాజాగారి మీద మాహిందిగేవడ్తో రాజాగారన్న మాటలు మీరు యెందు నిమిత్యం వచ్చినారు. మామీద్కి యేమయినా లడాయ్కి వచ్చినారా. ఆ నిమిత్యం చెప్పవలేనన్లో పెడిగ్గాను అన్నమాటలు. మేము మీమీద్కి లడాయ్కి రాలేదు. మిమ్మును చెన్నపట్నం పంపించడాన్కు రావడమయ్నది. అంతేకాని మీతో లడాయ్కి రాలేదు. అని అన్నంద్కు రాజాగారు మేము చెన్నపట్నం పోవడాన్కు నిమిత్తంలేదు. మేము కంఫిణీవార్కి యిష్టుల మయినవారం కాని అయిష్టులయినవారం కాము. యిక్కడివాడుచేస్ని దుష్టంత్రం. అయితే సేమామును. మీరు యుద్ధంచేసే మాటయ్యంటే ధర్మయుద్ధానకు రావడంమంచిది. కాని దొంగతనాన రావడం మంచిదికాదు. అక్కడిక్కి మీరు అధర్మం చేసినారని లోకులు వాడుకుంటారు. గన్క సుఖంగామీకుయేదియుక్తమో అది విచారించుకోవచ్చునుమని శెలవు యిచ్చినారు. యిలాగున్న మాటలు జరుగుతూ ఉండగా అప్పుడు విజయరామరాజా తన కొమారుడు తొమ్మిది సం॥రములచిన్నవాడు అయిన్న నారాయణబాబును పిలిపించి తన తొడ మీద కూర్చుండబెట్టుకొని చాలా దుఃఖపడి నాయనా నీమీద ప్రేమచేతను నేను యింత నీచానకు వొప్పి ప్రాణాలతో ఉండడమయ్నది. మనకు గ్రహచారం చాలనందువాతను మన నౌఖర్లు కుంఫిణీవార్కి బాజీ యిచ్చినారు. యీ జన్మంతోటి నాకూమీకూ ఋణానుబంధం చెల్లినది. మీరిన్ని తీస్కొని కాశీపురం ప్రవేశించుమని శెలవుయిచ్చినారు గన్క ఆ చిన్నవాడు మనవిచేసినది. నేనన్నా తమ హాజూరునవే వుంటాను. మిమ్ములను వదలిపోవను. అనెను. అంద్కు రాజాగారు వొప్పక యీ చిన్నవాణ్ని చాలా బుజ్జగించి కామకావెళ్ళక అనుకూలం కాదని యీ నారాయణబాబుగార్ని రాజాగారి భార్య పట్టపుదేవి శీతమ్మగార్ని కొంత రాణువ నారాయణబాబుగారి ఖాసా దివానుఅయ్న కాకర్లపూడి బాపిరాజు మొదలయ్న వార్ని తయినాతీ చేసి కాశీపురం పంపించినారు. యింతో మూడు దినముల్లో అయింది. ఈ॥ కర్నల్ పెడిగ్గానువారున్నూ లడాయికి సిద్ధమయినారు. గన్క అలాగే రాజాగారున్నూ ఆషాఢ శు ౧౨ బుధవారం దినం కుంఫిణీవారు తమమీద లడాయికి వస్తారని జాగ్రతతోటి వుండగా వీరు దండులో కొందరు కుంఫిణీవార్కి బాజీయిచ్చినారు. అప్పుడు రాజాగారు బహు జాగ్రతగా వున్నారు. రావద్దని వర్తమానం పంపించినారు. గన్క వారు మానినారు. మరునాడు రాత్రి రాజాగారు రాత్రి బహు జాగ్రతతోటి వుండి వుదయం కానడాన్కి వాల్గు ఘడియల రాత్రి ఉన్నదాకా మేలుకొని అందరికీ బహుజాగ్రత్తలుచెప్పి, తను పడుకు నేవర్కు అసమయం కన్క యీదుర్మార్గులు యిప్పుడు రాజాగారు పడుకున్నారు. అంతా అజాగ్రత్తతోటి ఉన్నారని యెరుకచేసినా

ర్కి సమాచారం పంపించినందుకు కుంఫిణీవారు అతి త్వరితంగా తురుఖదాయి ఖూనవచ్చి రాజుగార్కి నిద్ర లేపేవరక్కి మేల్కొని యేమి యింతగా నిద్రలేపితిరని అడిగిరి గనుక్కి. కర్నలుకిడ్డుగ్గాను పటాలాలతో వచ్చి మన మీద దిగవున్నాడు అని చెప్పినారు. తదనంతరం రాజుగారు లేచి అతిత్వరగా దంతధావనం చేసుకుని అద్దం తీసుక్కురమ్మని తెప్పించి చూచుకునేవరక్కి ముఖమందు తిరుమణి తిరుచూర్ణాలు లేవు గనుక్కి అప్పుడు తిరుమణితిరుచూర్ణంధరించి అద్దంలో ముఖం చూచి అన్నమాటలు యీదినం రంగడి ఆజ్ఞ అవుతూ వున్నది మనం యుద్ధానిక్కిపోయి తిరిగి రావడంలేదు. అని యీమాటలు వాగ్దావిశ్వవాడి, యీవలవచ్చేవరకు తోరణాలజావడీ అంబారీ కట్టించి వుంచినారు గనుక్కి సామాన్యాలు తీసుక్కి వచ్చినారు. అప్పుడు రాజుగారిదగ్గిర రావు జోగన్న్య గారు వున్నారు గనుక్కి ఆయనతోటి అన్నమాటలు. యీరోజున మనకు యేలినవాడి ఆజ్ఞ అవుతూ వున్నది. నిన్నటిదినం గనుక్కి వారు వచ్చిన మాట వుంటే వారి తంత్రవంతమున్ను మన తుత్రవంతమున్ను తెలుసును. యిదిగాక మన దగ్గిరవున్నవారు బాజీ యిచ్చినారు. మనం అంబారీయొక్క లడాయికి పోతే యెక్కడవారు అక్కడ పితూరీచేసిరా! వారు అంబారీ ఖడాయించిరా? మనం వారిచాత దొర్కి పట్టుబడవలసివచ్చును. యిందుక్కు దాఖలా యేమంటే నిన్నటిదినం వారు రావడం యేమంటే మన నౌకర్లు వార్కి సమాచారం పంపించినారు. యిందుచాతనంటే మనం తెంరాయిలో వున్నందువంతను। యిదిగాక మనం రాత్రి అంతా మేల్కొని నాల్గుఘడియలరాత్రివుండగా పడుకుంటే అప్పుడు వచ్చినారు. అక్షణంకబురుపోయింది. లేకపోతే అయితే అక్షణమందు ఖబురు తెలిసి రావడానిక్కి వారు కలగన్నారా? యిన్నింటిక్కి నిన్నటిదినం వారువచ్చి వట్టున్నంటే వారి పరాక్రమం మన పరాక్రమమున్ను తెలుసును. యిక నాల్గుఘడియలక్కి మనం స్వామి సన్నిధానానిక్కి వెళ్ళేటట్టు ఆజ్ఞ అవుతూవున్నది.

యిప్పుడు మనం అంబారీయొక్క యుద్ధం చేయవలసినది యేమివున్నదిగనుక్కి అయినా వస్తుయుత్తుమీద వడుతాము. అయితే ఆ ఆలోచన్నమీద జయంకావలెను. లేనిపక్షానక్కి మానంతోటి ప్రాణాలు వదలుకోవడం మంచిది. అని రావు జోగన్న్యగారు తనయొక్క యీలాటి మాటలు అనుకొని అంబారీ వద్దకి పాలకీసవారు అయినారు. ఆ సమయంలో కర్నాటకంరాకత్తూ యీ క్వేళకు లడాయి లేదు. అనుకొని కొందరు మొఖాలు కడుక్కొపోయినవాండ్లు కొందరు బహిర్భూమిక్కి పోయినవాండ్లు కొందరు యీ తీరున శిక్కస్తుగాలుగా వున్నారు యీమహారాజులుంగారు యుద్ధానకు పోయ్యేటప్పుడు యెవర్ని రమ్మని పిలువలేదు. సిగ్గున్నవారు గనుక్కి అయితే వస్తారు. రమ్మన్నారు గాని యిన్నిదినములనుంచి మన సొమ్ముతిని బ్రతికినారుకదా? యిప్పుడెందరూ లడాయిచేసి సాయకపోవడాన్ని నిమిత్తంయేమి అని విచారించినారు కారు. రాజుగారు పల్లకీయెక్కి ముందర నడిచి వారని చెప్ప వేగం నూటయాభైమంది పల్లకీ మొదలయ్యినారు విజయరామరాజుగార్కి అడ్డం వచ్చి మహాప్రభో నిముషమాత్రం నిలువండి మన తాలూకా కర్నాటకంమాత్రం రానివ్వండి. అంతా కలిసే యెదుటివాండ్లను యీగలయెగరగొట్టినట్టుగా కొట్టవచ్చునని సామాజికులు యావత్తూ మనవిచేసుకుంటూ వుంటే మహారాజులుంగారు నిలువపడక నడిపిస్తూ వున్నారు. యీసమయంలో సిరిదగ్గిర హాజరుగా వున్నవారు అనవబేగ కుమందానుగారున్ను దావుదు ఖానుకుమందానున్న యీయిద్దరూ సరిదార్లు తిరవునానున్ను రెండు వేల యెకుమిక్కి తుపాకీ బారు వున్నది. యీ బారుమాత్రం రాజుగారితో కూడా వున్నది. అప్పుడు విజయరామరాజుగార్కి వెనుక వుండుమని యీ రాజులు మనవిచేస్తే అంత్తు విజయరామరాజుగారు అన్నమాటలు మావలో పితూరీగనుక్కి లేకుంటే యీబారుతోటి కార్యం ఘనే చాతకుంటే నాపేరు విజయరామరాజుకాదు. పితూరీగనుక్కి జగ్గితే యేవరమూ నిలువలేము. యిం

## శ 1079

### కొయ్యాన అయ్యానపెగ్గడ

విశాఖపట్నంజిల్లాయిలాకా గుడివాడతాలూకా లో చేరిన పెల్లంకి పెద్దిపాలెం గ్రామం పడమర చెర్వు కట్ట కిందను గాజమ్మవారి మండపం పాతివున్న నల్లరాతిమీది శాసనము—

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౦౭౯ అగు నేటి శ్రీమదనంతివర్మ దేవర ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు ౮ శ్రావణామావాస్య కృష్ణనవమియు శుక్రవారం దక్షిణాయన సంక్రాంతినాడు తాడితోత్రి బొమ్మదీశ్వరి దేవికి కొయ్యాన అయ్యానపెగ్గడ పెట్టిన అఖండదీపమునకు టంకమాడలు ౫ పాలి నిత్యమానెందు నెయ్యి తాడితోత్రి మహాజనము ఆచంద్రార్కము నడుపంగలవారు.

## శ 1079

### గొల్ల పోతయబోయండు

విశాఖపట్నంజిల్లాయిలాకా గుడివాడతాలూకా లో చేరిన పెల్లంకి పెద్దిపాలెం గ్రామం పడమర చెర్వు కట్టకింద దుగాజమ్మవారి మండపం పాతివున్న నల్లరాయిమీది శాసనము.

మూడవ పలక

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౦౭౯ అగు నేటి శ్రీమదనంతివర్మదేవర ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు ౮ అగు శ్రావణామావాస్యను కృష్ణ నవమియు శుక్రవారమున, దక్షిణాయన సంక్రాంతి నాడు తాడితోత్రి బొమ్మదీశ్వరి దేవికి నియోగ విజలియు గొల్ల పోతయబోయండు పెట్టిన అఖండదీప మునకు మాడలు ౫ కి బారి నిత్యమానెందు నెయ్యి తాడితోత్రి మహాజనము ఆచంద్రార్కం నడుపంగల వారు.

## శ 1079

### అనంతివర్మ

విశాఖపట్నంజిల్లాయిలాకా గుడివాడతాలూకాలో చేరిన పెల్లంకిపెద్దిపాలెం గ్రామం పడమర చెర్వుకట్ట కింద దుగాజమ్మవారి మండపం పాతివున్న నల్లరాతి మీద రెండో ప్రక్క మీద వ్రాసినశాసనము—

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౦౭౯ అగు నేటి శ్రీమదనంతివర్మ దేవర ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు ౮ శ్రావణామావాస్య కృష్ణనవమియు శుక్రవారం దక్షిణాయన సంక్రాంతినాడు తాడితోత్రి బొమ్మదీశ్వర దేవికిం జెంజడిగా బల్లమండయుండు పెట్టిన అఖండదీపమునకు మాడలు ౫ యీనిత్యమానెందు నెయ్యి తాడితోత్రి మహాజనము ఆచంద్రార్కము నడుపంగలవారు

## శ 1071

### గన్నజాతిశెట్టి

విశాఖపట్నంజిల్లాయిలాకా గుడివాడతాలూకా లో చేరిన దాకమర్రిగ్రామం పడమర గుండుగట్టు మీద పాతదేవాలయం దిబ్బమీద పాతివున్న నల్లరాతిమీది శాసనము.

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౦౭౧ అగు నేటి ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున దాకమర్రి ద్రాక్షాయన మహాదేవరకు గన్నజాతిశెట్టి తనకులం ఉల్లిదఋతుల్కు ధర్మముగా దాకమర్రి మహాజనములకుం నేను మాడలు పెట్టి ధాన్యరాశిక్రింద ఖండిక నెల పుట్టెండును నిట్టినవారమున అప్పసదమునకు నియవదేను చిన్నములకుం బందుము నెలయును గాపిలిచి యిచ్చితిమి. యీధర్మమునకు ఆచంద్రార్కం నడుపంగలవారు దీని విఘ్నముచేసినవారు వారణాశి బ్రద్మి వపాపమునం బదుదురు.

## శ 1074

### గంగకొండదేవి

విశాఖపట్టణంజిల్లా యిలాకా గుడివాడ తానా లో చేరిన మ॥ తాడితుర్తి సింగవ బంగమధ్య పాలి మెరమీది వల్లరాతిమీద వున్న శాసనము.

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౦౭౪ అగు నేటి శ్రీమదనంతవర్మదేవర ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు ౭౫గు శ్రావణమాసమున కృష్ణ సప్తమీ ఆదివారము నాడు తాడితుర్తి గోకర్ణేశ్వర మహాదేవరకు శ్రీమతు గంగకొండదేవి పెద్దదేవి పెట్టిన అఖండదీపములు రెండింటికి మాడలు రేను తాడితుర్తి మహాజనము యీదీపములు ఆచంద్రార్కంవరకు వుంచలవాడు దీని నెవ్వరేని విఘ్నము జేసినేని గంగకర్త వెయిగవిల బొడిచిన పాపమునం బడువారు. శాణరాశి బ్రదచ్చిన పాపమునం బడువారు.

---

## శ 1106

### నంబిశెట్టి

విశాఖపట్టణంజిల్లాయిలాకా గుడివాడ తానా లో చేరిన భోగాపురంలో నడివీధిలో వున్న రచ్చరాయిమీది శాసనము.

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౧౦౬ అగు నేటి శ్రీమదనంతవర్మ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు౧౧ అగు శ్రావణ ఉత్తరాయణసంక్రాంతి నిమిత్తమునం............సంపున నానాదేశి విక్రమగంగదేశి వీరవెంట అయిన భోగపురమున వెన్నప సెట్టి కొడుకు దేశి యాభరణ నంబిశెట్టి సైన జేసదిసె త్రించిన శ్రీ రాజరాజదీపాలయమున్నకు రాజరాష్ట్ర గ్రామవర్ధనగా దేశిరెడ్డి అను మతమున వితలకులము తూర్పునం పెట్టిన నివేద్యభూమి పుట్టి దక్షిణమాటి ఈశాన్యమున అఖండదీపమునకుం బెట్టిన గాటపుట్టి దీనిని ఆచంద్రార్కముగా పెట్టిరి

శాకాబ్దే శశిఖేందు రంధ్ర గణితే
శ్రీభోగపుర్యాం ప్రభుః
శ్రీమాన్వర్ణనమి నాయకస్యమనుమాన్
శ్రీత్యాజవస్థాపనా
త్రిస్యాగారసం భీకర
త్స్నవిల సచాటిత్రదాభాసురం
రామోరాసుగిరౌ యథా
జనపతాబ్జా సక్తచిత్తస్సయం॥
స్వదత్తం పరదత్తం వా।
యోహరేతి వసుంధరా॥
షష్టివర్షసహస్రాణి
విష్టాయాం జాయతేక్రిమిః॥

అంబికాదేవికి నాగమనాయకురాలు పెట్టిన భూమి సందుమాదుర్గా నివేద్యమునకు.

---

## శ 1097

### దేశిరెడ్డి

విశాఖపట్టణంజిల్లాయిలాకా గుడివాడతానా లోచేరిన భోగాపురంలో నడివీధిలో వున్న రెండవరాయి మీది శాసనము.

స్వస్తిశ్రీ మదనంతవర్మదేవర ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు ౩౧ శకవర్షంబులు ౧౦౯౭ అగు నేటి వృశ్చికసంక్రాంతియు కృష్ణపంచమియు బృహస్పతివారమున భోగపురపు దేశిరెడ్డి చాతిలో కమినిక శెట్టి చెర్వు గోవద్రవ్య మిచ్చి చెర్వుక్రింద ౩౮ వావలం కోల రెండు పుట్లు నేల నిరభ్యంతరముగా వెలుగుపాటి మాకయ చెర్వుకు ధర్మార్థంకము చేసి సంక్రాంతిదానము యిచ్చిరి. దీనికి నాచంద్రార్కము నడుపంగలవాడు దేశిరెడ్లు యీధర్మము విఘ్నముచేసినవారు వారణాశి బ్రదచ్చిన వారు గంగకర్త వెయిగవిలల వధించినవారు నడిపిన వారికి వెయ్యి అశ్వమేధముల ఫలము.

స్వదత్తం పరదత్తం వా
యోహరేతి వసుంధరా।

ప్షిసర్ణవర్ణ సహస్రాణి
విష్టాయాం జాయతే క్రిమిః॥

---

## శ 1168

### మేరూమాధవాచార్య

విశాఖపట్నంజిల్లాయిలాకా గుడివాడతాణా లో చేరిన బోనిలో గ్రామమధ్య శ్రీ అమరేశ్వరస్వామివారి ఆలయంలో ముఖమంటపంలో నైఋతిమూల స్తంభంమీది శాసనము.

శ్రీశాకాబ్దే గజర్తుక్షితి
పరిగణితే మాఘశుక్లే శశసూర్గ్రే।
యావచ్చంద్రదికర తారం
పురరిపు పురతో దీపమాగ్న్యస్య హేతోః॥
శ్రీమేరూమాధవాచార్య
రఖిలబుధ శిరోభూష సౌధర్మ కర్మభక్త్యా।
భోగాదత్త స్వతంత్రీకృత
విధవకృతే పాప్వతీ వల్లభాయ॥

---

## శ 1249

### గొట్టిపాటి నారాయణస్వామి

విశాఖపట్నజిల్లా యిలాకా గుడివాడతాణా లో చేరిన బోనిలో గ్రామమధ్య శ్రీఅమరేశ్వరస్వామివారి దేవాలయం ముఖమంటపంలో తూర్పుద్వారబంధం ద్వారశాఖమీది శాసనం—

స్వస్తి శకవర్షంబులు ౧౨౪౯ అగునేటి వృశ్చికశుక్లపున్నమియు సోమవారమున బోని శ్రీఅమరేశ్వర దేవరకు గొట్టిపాటి నారాయణస్వామి పెట్టినపత్తము అఖండదీపమునకు గొరియలు ౫౦ ఆచంద్రార్కం—

## శ 1173

### రాయసంప్రధాని ప్రెగ్గడ

విశాఖపట్నంజిల్లా యిలాకా గుడివాడతాణా లోచేరిన బోనిలో గ్రామమధ్య శ్రీఅమరేశ్వరస్వామివారి దేవాలయం ముఖమండపంలో తూర్పుద్వారబంధం కుడివైపున లోపలగా అంటివున్న ద్వారశాఖమీది శాసనం—

స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౧౭౩ అగునేటి శ్రీమదనంతవర్మ దేవర నారసింహ్వ శ్రీమతు దేవర ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు ౧౭గు శ్రావణ వుత్తరాయణసంక్రాంతినాడు సాహిణీదాదియునుంబంటు పెరనృసింహ్వదేవునికిభుజవర్ధనగాను శ్రీయమరేశ్వరదేవరకు రాయసంప్రధాని ప్రగడయ గంగాలునుడియు దారసామలమీదయుం నీయిరుభూముల నీరు నెల ౩ మూడుపుట్లు యిచ్చెను నీవృత్తులు ఆచంద్రార్కముగా ధర్మార్థముగా నిచ్చితిమి. ఈధర్మమునకు నెవ్వరేని కాలవిపరీతమున విలోపము చేసినవారు గంగకడ వేయిగవిలల వధించినవారు.

---

శకం—లేదు

### నృసింహ్వదేవనృపతి

విశాఖపట్నంజిల్లాయిలాకా గుడివాడతాణా లోచేరిన బోనిలో గ్రామమధ్య నెంచేసియున్న శ్రీఅమరేశ్వరస్వామివారి దేవాలయంలో మంటపంలో వుత్తరబాజన మూలంమీది శాసనం—

స్వస్తి శ్రీశకవర్షంబు శివాంబక నందికాళీశనిశాని మితా సుకవి ప్రియ శుక్లకమాఘవామాశి శివాసుప్తమి మను నురేశి శాంధ్రమకణీజధికం॥

స్వస్తిశ్రీ మతుకాపకేతి త్రిజగత్ కత్రప్రతాప స్ఫూర్తి తిక్తితిణః। శ్రీతకజంధవైరి విధివ శ్రీభోణీ దేవమహాం। ధీమే శస్య కిశామహా విమహిదా జేశశితా యీరారితా। వీరశ్రీ నృసింహ్యాదేవనృపః త్రైలోక్య మాన్యోభ వేత్॥

శేషామానమనోవనోవి విదుషాం మాణిక్య మాలా విషా। ద్విత్రేజః కణికాభిదేవ విమరా। మజ్జః ఫణిగ్రామణి ప్రాతాతాం ధసికింవయ త్కటపటుద్ధాం శాఠ శాపానితే। ముద్రాశా గగనె రవిశ్చరమసా బుద్భైవపణ నాణయతే। జాతరూపగుచీవిచి। భావ నా జాతరూపకా, మజ్జాతిః శతృవఃభూమ। ణాగణ్జగ తావిభూవణం॥

శ్రుతి స్త్రైప్రురగనైరి కింకరః॥ పున్నాగ సుర పున్నాగ నాగకేసరి చంపకైః। పాటలాబకుళాకాది పకశాది మహామహేః॥

ఇక్కడనుంచి అక్షరములు అరిగిపోయినందున అగపడలేదు—

---

## శ 1365

ముకుంపులు

విశాఖపట్నంజిల్లా యిలాకా పెదగాడి తాలూకా లోచేరిన కొండకొండమీద వీరభద్రస్వామి ఆలయం ముందర పాతివున్న శిలాస్తంభంమీది శాసనము—

సూర్యుడు—చంద్రుడు

శ్రీశకవర్షంబులు ౧౩౬౫గు అగు నేటి శుక్ల సంవత్సర మార్గశిరబ౭ శుక్రవారం కొండాయకొండ శ్రీవీరభద్రేశ్వరునకు శ్రీకపిలేశ్వరగజపతి ఆజ్ఞను గోవిందవీరమాడ మహాపాత్రముకుందుడు శ్రీవీరేశ్వరునకు అష్టభోగసిద్ధిగా యిచ్చిన నీరునెల మడితులు ౧—

ఇందుకు సాక్షులు—అష్టలోకపాలు సూర్యచంద్రులు—

యతో ధర్మస్తతో జయః॥

---

శకం—లేదు

కొండువరాంబా

బందరుజిల్లా యిలాకా తెనాలితాలూకాలో చేరిన మం॥ పెరవలి గ్రామంలో కెంచేపియున్న శ్రీమాధవస్వామి ఆలయంలో కల్యాణమంటపం పడమర స్తంభంమీది శాసనము—

శ్రీరమణుం డార్యనుతో
ద్దాముఁడు గొంకవిభు మామదవిఖ్యాత కీర్తి సం
హారుడు ధీరుడనందగు
మారయపందండుకీర్తి మండనుడు నుపీణా॥ ౧॥
అవదగు పండేశు ప్రియాం
గన గొమ్మమవిభునమిత్ర గణపతివారిం
బుడకొల్లను వ్యావయానం
దనకాంతిని యుగనెగడె ధారుణిమీదన్॥ ౨॥
ఘనుడం మావిని కొమ్మమ
కును లీలావతికిని శైర్య గుణవతిగాని పెం
పున నెగడిన మల్లాంబిక
సురతయానబరగ శైర్యగుణసంపూర్ణతో॥ ౩॥